## స్త్రీ ప్రథమ రజోదర్శన గుణదోషములు

**తిథులు:** పాడ్యమియందు మహాపాపినియును, విదియయందు పుత్రవతియును, తదియయందు సౌఖ్యవతియును, చవితియందు వృషలియును, పంచమియందు శుభప్రదురాలును, షష్ఠియందు వికృత సంచారిణియును, సప్తమియందు శుభ ప్రదురాలును, అష్టమియందు వికృత సంచారిణియును, నవమియందు విశేషకష్టియును, దశమియందు పుత్రవతియును, ఏకాదశియందు శుచికలదియును, ద్వాదశియందు పతిని దూషించునదియును, త్రయోదశియందు పుత్రవతియును, చతుర్దశియందు కోపనయును, పూర్ణిమాఽమావాస్యల యందు దుష్టచారిణియును అగును.

**నక్షత్రములు :** భరణి, ఆశ్లేష, పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వాభాద్ర యీ నక్షత్రముల 1 వ పాదం భర్తృనాశనమును, 2 వ పాదం పుత్రనాశనమును, 3 వ పాదం ధన నాశనమును, 4 వ పాదం అశుభమును కలిగించును. మరియు కృత్తిక, ఆర్ద్ర, పునర్వసు, మఘ, జ్యేష్ఠ యీ నక్షత్రముల యొక్క 1 వ పాదం మంగళము గలిగించును. 2 వ పాదముననైన 25గురికి భోజనము పెట్టవలయును. 3,4 పాదములందును, ఆది మంగళ శని వారములయందును, దుష్టకాలములయందును, దుష్టతిథులయందును దుష్టయోగములయందు రజస్వల అయినయెడల యథావిధిగా శాంతి చేయవలెను.

## సర్వరజస్వలకు సాధారణ నిర్ణయము

మూఁడు దినముల పర్యంతము స్పృశింపఁగూడదు. అభ్యంగము కాటుక స్నానము పగలు నిద్రించుట అగ్ని స్పృశించుట దంతధావనము మాంసాశనము సూర్యావలోకనము భూమియందు రేఖలుగీయుటయు వర్జింపవలెను. క్రింద బందు కొనవలెను. దోసిలిచేగాని రాగిపాత్రచేగాని లోహపాత్రచేగాని జలము ద్రావకూడదు. చిన్నగిన్నె మొదలగు పాత్రలతో ద్రావిన యెడ పొట్టి మరుగుజ్జుపుత్రులే పుట్టుదురు. గోళ్లు ఖండించినచో బుప్పిగోళ్లుగల పుత్రులు గల్గుదురు. ఆకులతో ద్రావినచో వెఱ్ఱి సంతతిగల్గును. రెండవమారు రజోదర్శనము మొదలుకొని ప్రయాణము గంధమాల్య ములు తాంబూలము గోవుపాలు పెరుగు చల్ల మొదలగునవి భక్షించుట, పీట మొదలగునవి యెక్కి కూర్చుండుట నివి వర్జింపవలెను. మృణ్మయపాత్రయందుగాని యినుపపాత్రయందుగాని భూమియందుగాని భోజనము చేయవలెను. గ్రహణము మొదలగు నిమిత్తములచే స్నానము ప్రాప్తించెనేని జలమందు మునిగి చేయగూడదు. మఱియేమనిన; పాత్రతో జలముపుచ్చుకొని స్నానముచేసి బట్టపిడువగూడదు. వస్త్రాంతరము గట్టనుగూడదు. ఇట్లు మృతాశౌచాది నిమిత్తక స్నానము నూహించు నది. ఏకగోత్రమందున్న వారుగాని మేనత్త మేనకోడలు మొదలగు రక్తస్పర్శమాత్రము గలవారుగానియైన రజస్వలా స్త్రీలిద్దరు పరస్పరమును ప్రమాదమున స్పృశించినచో మీఁదఁ జెప్పినరీతిని స్నానముజేసి శుద్ధినొందుదురు. బుద్ధిపూర్వకముగ స్పృశించి రేని యొకరాత్రి యుపవాసము చేయవలెను. మీఁదఁజెప్పిన బంధుత్వమేమియులేని స్త్రీలు రజస్వలలు పరాకున నొకరినొకరు ముట్టిరేని స్నానముజేసి యా దినమున భుజింపఁగూడదు. ఎదిరికావలెనని ముట్టినచో శుద్ధిస్నాన మగువరకును భుజింపఁ గూడదు. భుజించినచో శుద్ధిస్నానాంతరమందు భుజించిన దినముల సంఖ్యచే నన్ని దినములుపవాసము చేయునది. ఉపవాసముఁజేయ నశక్తియగునేని దానికి బ్రతినిధిగ బ్రాహ్మణభోజనాదికము జేయునది. అంతటను శుద్ధిస్నానమైన పైని పంచగవ్యము అనఁగా గోవుపాలు పెరుగు ఘృతము మూత్రము పురీషము నీయైదును సమభాగము

లుగ గలిపి భుజించునది. శూద్ర స్త్రీయు బ్రాహ్మణ స్త్రీయు నిద్దరు రజస్వలలై యొకరి నొకరు ముట్టిరేని శుద్ధిస్నానము పర్యంతము భుజింపఁగూడదు. శుద్ధియైన పైని కృచ్ఛ్రవ్రత ప్రాయశ్చిత్తమును బ్రాహ్మణస్త్రీ జేసుకొనవలెను. శూద్రస్త్రీకి పాద కృచ్ఛ్రము చాలును. రజస్వలకుగాని ప్రసవించిన స్త్రీకిగాని చండాలస్పర్శయైనచో శుద్ధిపర్యంతము భుజింపక శుద్ధిపైని నతికృచ్ఛ్రము గూడ జేయవలెను. అబుద్ధిపూర్వక ముగ నైనచో బ్రాజాపత్యకృచ్ఛ్రము, కఱ్ఱ మొదలగు నితరవస్తుద్వారముగా స్పర్శ మైనచో స్నానమాత్రముచే శుద్ధియగు భోజన కాలమందు స్పృశించినచో ప్రాజాపత్య కృచ్ఛ్రమును శుద్ధ్యనంతరమున ద్వాదశ బ్రాహ్మణ భోజనమును జేయునది. యాజ్ఞ వల్క్యస్మృతి వ్యాఖ్యానమైన మితాక్షరయందు రజస్వలకు పతితులు అంత్యజులు చండాలులు. వీరి స్పర్శ బుద్ధిపూర్వముగనైననచో శుద్ధిపర్యంతము భుజింపక శుద్ధ్య నంతరమందును స్పర్శదినము మొదలు శుద్ధిపర్యంత మెన్ని దినములుండెనో యన్ని దినము లుపవాసములు చేయవలెను. ప్రమాదమున స్పర్శయైనచో శుద్ధిపర్యంత ముపవాసము మాత్రమే. ఇట్లు గ్రామకుక్కటమనఁగ కోడి, పంది,కుక్క,కాకి, నక్షత్ర దర్శనమువఱకునైన భుజింపఁగూడదు. భోజనకాలమందు చండాలాదుల స్పర్శ యగుచో శుద్ధిపర్యంతము భుజింపక యటుపైని నారుదినములు గోమూత్రములత్తుక యాహారము జేయవలెను. అశక్తిలో సువర్ణదానమైనను బ్రాహ్మణ భోజనమైనను జేయవలెను. ఇద్దరు రజస్వల స్త్రీలు నెంగిలిచేతులతో నున్నపుడు స్పర్శయైనచో లేక యెంగిలితోన్ను చండాలుని స్పర్శయైనను కృచ్ఛ్రవ్రతముచే శుద్ధియగును. ఎంగిలి నోటితోనున్న విప్రాదిద్విజవర్ణస్తుని స్పర్శయైనచో రజస్వలకు మూఁడుపవాసములు. అటుగాక మూత్రపురీషోత్సర్గము చేసి శుద్ధుఁడుగాక ముందట్టిద్విజుని స్పృశించిన నొకయుపవాసమని చెప్పఁబడినది. ఇట్లెంగిలితో నున్న శూద్రుని స్పర్శయందధికము గల్పించుకొనవలెను. రజస్వలకు జాతాశౌచాదులతోనున్న మైలవాని స్పర్శయగుచో శుద్ధిపర్యంతమున భోజనము భుజించినచో కృచ్ఛ్రవ్రతము జేయవలెను. అయిదు గోళ్లుగల జంతువులు రెండుడెక్కలుగల జంతువులు నొక్కడెక్క గలజంతువులు వీని స్పృశించినచో లేక యండజములైనపక్షి సర్పాదుల స్పృశించుచో శుద్ధిపర్యంతమున భోజనము. రజస్వల స్త్రీని కుక్క, నక్క, గాడిద వీనిలో నేదైనను గఱచినచో శుద్ధిపర్యం తము భుజింపకుండుటయు శుద్ధ్యనంతరమున నైదురోజులుపవాసము. నాభికంటె నుపరిభాగమందు గరిచెనేని పదిరాత్రులుపవాసము. శిరస్సున గరచినచో నిరువది రాత్రులుపవాసము. భోజనము జేయుచు రజస్వలస్త్రీ మఱియొక రజస్వల స్త్రీని చూచినచో శుద్ధిపర్యంతమభోజనము. చండాలుని జూచినచో నుపవాసత్రయము గూడ జేయునది. బుద్ధిపూర్వముగ చండాలుని జూచినచో ప్రాజాపత్య కృచ్ఛ్రము. రజస్వలకు శవము సూతికాస్త్రీ వీని స్పర్శ గల్గినచో భుజించినయెడ కృచ్ఛ్రము జేయవలెను. ఈ స్థలము లన్నిఁటియందును బ్రహ్మకూర్చవిధానముచే బంచగవ్య ప్రాశనము మీఁదఁజెప్పఁబడినది. ఆశౌచముగలవారిని స్పృశించి స్నానము చేయక ముందు రజోదర్శనమైన యెడ జతుర్థదినపర్యంతము భుజింపఁగూడదు. అశక్తిలో

నపుడే స్నానముచేసి భుజింపవచ్చును. ఇట్లు బంధుమరణాశౌచము వినినపుడు స్నానమునకు ముందు రజోదర్శన మైనపుడు నూహించునది. అట్లు రజోదర్శన మైన పైని బంధుమరణము విన్నను శక్తిగల్గినచో శుద్ధిపర్యంత మభోజనము లేనిచో నప్పుడే స్నానముజేసి భుజింపవచ్చును. కొందఱు స్పృశింపఁ గూడనివాని స్పర్శ యందంతటను నశక్తిలో స్నానానంతరమున భోజనము శుద్ధ్యంతమందుపవాస ప్రతినిధి జేయవలెనని యందురు. రజస్వలకు ప్రథమదిన నిర్ణయమెట్లనిన; రాత్రి మూఁడు భాగములుజేసి మొదటి రెండుభాగములలో రజోదర్శన మైనచో పూర్వదినమే ప్రథమము, తృతీయభాగమందైనచో బరదినమే ప్రథమదినమని నిర్ణయము. కొంద రర్థరాత్రమునకు బూర్వము రజోదర్శనమైనచో బూర్వదినము ప్రథమమనియు, అర్థరాత్రమున కనంతరమైనచో బరదినమే ప్రథమమని యందురు. దేశాచారమున వ్యవస్థ దెలియునది. ఇట్లు జననమరణాదులకు నాశౌచమునకు నెఱుంగునది. తరు చుగా ముప్పదిరోజులకే రజోదర్శన మగుచుండుట యున్నవారికి పదునేడు దినముల పర్యంతము తిరుగ రజోదర్శనమైనను స్నానముచేతనే శుద్ధి, పదునెనిమిదవ దిన మందైనచో నొకరాత్రి యందుశుచిత్వము, పందొమ్మిదవ దినమందైన యొక రెండు రాత్రులశుచిత్వము. ఇరువది మొదలుకొని మూఁడురాత్రు లశుచిత్వమని యెఱుంగు నది. ఇఁక దరుచుగా పదునైదు దినములకే రజోదర్శన మగుచుండుట మామూలు పడ్డవారికి పదిదినముల పర్యంతము తిరుగ రజోదర్శనమైనను స్నానము చేతనే శుద్ధి. పదునొకండవ దినమందునైనచో నొకరాత్రి యశుచిత్వము. పంద్రెండవదిన ముననేని ద్విరాత్రము. అటుపైని మూఁడు రాత్రులే రోగముచే నిత్యమును రజః ప్రవృత్తియయ్యెనేని యపుడు స్పర్శ కూడని యశుచిత్వములేదు. మరి దానిని వృత్తిగలుగు పర్యంతము పాకమందును దైవ పితృకర్మల యందును నధికారము మాత్రమురాదు. ఇఁక రోగమువలన నటులగు చున్నప్పటికి దిరుగ నెప్పటిసమయ మునకు మాసమందు రజోదర్శనమగును. దాని సావధానముగా గనిపెట్టి మూఁ డురాత్రు లశుచిగ నుండవలెను. గర్భిణికి ప్రసవము గాక ముందురోగముచే రజోదర్శనమైనచో మూఁడు రాత్రులశుచిత్వము. ప్రసవమైన పైని నెలదినముల పర్యంతములోనైనచో స్నానమాత్రముచే శుద్ధిమాస పూర్ణమైనపుడు గనుపించినయెడ మూఁడు రాత్రులశుచిత్వము భోజనముజేసి యెంగిలి ముఖముతో నున్నపుడు రజస్వల యైనచో శుద్ధ్యంతమందు మూఁడుపవాసములు చేయవలెను. ఇఁక మూత్రపురీషోత్సర్గ ముజేసి ప్రక్షాళనము జేసుకొనకముందశుచియై యున్నపుడు రజస్వలయైనచో శుద్ధ్యంతమందొకరాత్రి యుపవాసము. రజోదోషముగలిగిన నెఱుం గక గృహమందు పనిచేయునేని యపుడాబిడె స్పృశించిన గోరసమృద్భాండాదిక మును జలాదికమును విడువ నక్కఱలేదు. ఏమనిన; సూతకమువలె తెలిసిన క్షణము వద్దనుండియె యశుచిత్వము. అట్లు తెలిసిన దినము మొదలుకొని మూఁడుదినము లని నిర్ణయము. కొందఱు రెండవది మొదలగు దినములందు జూచినచో సూతకము నకువలె

శేషించినదినములచే శుద్ధియనియందురు. ఇట్లు మూఁడు రోజులుండి నాల్గవ దిన మందు నరువదిమారులు మృత్తికాశౌచముచే మలినముగడిగికొని దంత ధావనము జేసి యారుగడియల ప్రొద్దయిన పైని స్నానము చేయవలెను. సూర్యోదయ మునకు ముందు స్నానముచేయుట యానాచరము. నాల్గవదినమందు రజోనివృత్తి యయ్యేనేని భర్తృశుశ్రూషాదులయందు శుద్ధురాలగును. పంచమదినమందు దైవ పితృకర్మల యందు సహితము శుద్ధియగును. కొన్నిదినములు రజోనివృత్తికానిచో గర్మాది కారము మాత్రములేదు. రోగముచే నట్లైనచో మీఁదఁ జెప్పఁబడినది. కొందఱు నాల్గవదిన మందు దర్శేష్టి మొదలగు శ్రౌతకర్మలు ఛేయవచ్చు నందురు. మరికొందరు తక్కిన దినముల కంటె జతుర్థదినమే యనుకూలమగుటచే నా దిన మందే గర్భాదానము రజోదర్శనదోషమున్నచో దానికిశాంతికర్మయు చేయవలెను. కాలాంతరము సంభ వింపనిచో శ్రీసూక్తహోమ పూర్వకమైన యభిషేకము నుపనయ నము మొదలగునవి యును జేయవచ్చుననిరి. ఇట్లు చతుర్థదినమందధికార నిర్ణయ మును స్పష్టముగ రజోనివృత్తి గలిగినపుడెయని తెలియవలెను. జ్వరాదులచే బాధగలిగి చతుర్థదినమందు స్నానము చేయలేని యెడల నామెను మఱియొకరు పదిమారులు స్పృశింపుచు స్నానములుచేసి యాచమనము జేయవలెను. ప్రతిస్నానమందును నా బిడ్డకు మఱియొక్కొక్కవస్త్రము గట్టింపు చుండవలెను. అంతమందన్ని వస్త్రములు విడువ వలెను. తుదకు తడిబట్టగట్టించి మరియొక శుద్ధవస్త్రము గట్టించినపైని పుణ్యాహవాచ నము బ్రాహ్మణభోజనముఁ జేసినచో శుద్ధియగును. రోగగ్రస్తులైన యందరకు నిట్లు శుద్ధి విధింపఁబడినది. ఇట్లు శుద్ధ్యనంతరమందు శుభదినమున దుష్టరజోదర్శన నిమిత్తమైన శౌనకప్రోక్తమైన భువమేశ్వరీశాంతినిగాని గ్రంథాంతర మందు జెప్పఁ బడిన శాంతినిగాని చేసి యటుపైని గర్భాదానము చేయవలెను. సూర్యగ్రహణమందు రజోదర్శనమైనచో బంగారు సూర్యబింబమును గ్రహణ నక్షత్ర బింబమును సీసము చేతను రాహురూపము నుంజేసిన పూజించి జిల్లేడు సమిధలచే సూర్యునికి జువ్వి సమిధలచే నక్షత్రేశునికిని రాహునకు దూర్వలచేతను హోమము జేసి యాజ్యము చరువుతిలలు ఈ మూఁడిటిచేతను హోమము చేయవలెను. చంద్ర గ్రహణమందు రజతచంద్ర బింబమును మోదుగు సమిధలచే హోమము నని విశేషము. గ్రహణము వ్యతీపాతము మొదలగు బహుదోషములున్నచో ద్వితీయాది రజోదర్శనమైన పైని శాంతి పూర్వముగ గర్భాధానము చేయవలెను.గర్భాదానమునకు గురుశుక్రాస్తమ యాదలు గాని యధికమాసముగాని బాధకములుగావు. మొదటి రజోదర్శన మందు శాంతిజేయనియెడ ద్వితీయాది రజోదర్శనమందు గురు శుక్రాస్తాది దోషప్రసక్తియగు. నిమిత్తావ్యవహితోత్తరమందే నైమిత్తికానుష్ఠానము జేయుచో గురు శుక్రాస్తాది దోషము లేదు. ముఖ్యకాలము దాఁటినచో నస్తాదిదోష ముందు నను సామాన్య నిర్ణయమును బట్టి ఋతుశాంతి యస్తాదులందు కూడదు. దాని ననుసరిం చిన గర్భాధానమును గూడదని తోఁచుచున్నది.

## భువనేశ్వరీ శాంతి

శాంతియును గ్రహముఖముతో గలిపి చేయవలెను. శాంతియందు భువనేశ్వరి ప్రధానదేవత. ఇంద్రుండు శచియు పార్శ్వదేవతలు. ఇట్లు మూండు కలశములందును మూండు ప్రతిమలు స్థాపించవలెను. గ్రహములకు జిల్లేడు మొదలగు సమిధలును చరువు నాజ్యమును హోమద్రవ్యము. ప్రధానదేవతలకు దూర్వలు తిల సహితమైన గోధూమములు పాయసము నాజ్యమునను నీనాల్గును హోమద్రవ్యములు. ఇట్లు పార్శ్వదేవతలకు నన్నియు, పాయసము ప్రతిష్ఠించిన యగ్నిలో శ్రవణము చేయవలెనుగాని గృహమున సిద్ధము చేసినది పనికిరాదు. గ్రహహోమమునకు మాత్రము గృహమందు వండినయన్నము తీసుకొనవచ్చును. పాత్రాసాధనము చేయునపుడు పాయసమువండుట కొకస్థాలినాసాదించవలెను. గృహసిద్ధాన్నమును సంస్కరించుటకు మరియొక స్థాలియునుంచవలెను. ఆజ్యహోమము ననేకులు జేయవలసిన యెడ ననేక స్రువలాపాదింపవలెను. ఆజ్యముతోగూడ మూండు హవిస్సులకును గృహ సిద్ధాన్నమునకును పర్యగ్నికరణముజేసి స్రువాదులను దుడిచినపైని గృహసిద్ధాన్నము నాపాదించిన చుస్థాలియందుంచుకొని, యగ్నియందుంచి తీసి యభిఘరించుట మొదలు బర్హిస్సువేయుట పర్యంతమైన కర్మజేసి పాయసము నభిఘరించి యాసాదించుట సయితము జేయవలెను. అన్వాధానమందును హవిస్త్యామందును ప్రధాన దేవతలను భువనేశ్వరీనామముచేతను సవితృపదముచేతను నుచ్చరింపవలెను. యేమనిన; గాయత్రిచే హోమముం జెప్పంబడినది. ఆజ్యభాగాంతమందు యజమానుదన్వాధానము ననుసరించి "ప్రతిదైవతమష్టావింశత్యాహుతి పర్యాప్తమర్కాది జాతీయ సమిచ్చర్వాజ్యాత్మకమిదంహ విస్త్రయంసుర్యాయ సోమాయ భౌమాయ బుధాయ బృహస్పతయే శుక్రాయ శనయే రాహవే కేతవే నమః అష్టావష్టాహుతి వర్యాప్తంతద్ధ విస్త్రయంతత్తదధిదేవతా ప్రత్యధిదేవతాభ్యో నమః, చతుశ్చతుస్సంఖ్యాపర్యాప్తం తద్ధవిస్త్రయం వినాయకాదిభ్యః క్రతు సంరక్షణ క్రతుసాద్గుణ్య దేవతాభ్యో మమ అష్టోత్తర శతసంఖ్యాకాహుతి పర్యాప్తం దూర్వాతిల గోధూమపాయసాజ్య రూపహవిశ్చతుష్టయం భువనేశ్వర్యై మమ యద్వాసవిత్రేనమమ ఏవమష్టావిశంతిపర్యాప్త తచ్చతుష్టయ మింద్రేంద్రాణీభ్యాం నమమ" యని త్యాగముజేయవలెను. బహుదోషములకు శాంతి జేయవలసినచో నష్టోత్తర సహస్రసంఖ్యచే భువనేశ్వరికిని నష్టోత్తరశతసంఖ్యచే నింద్రేంద్రాణులకును హోమము వైకల్పికము. హోమాంతమందు గ్రహాదిబలులును భువనేశ్వర్యాదిబలులును నభిషేకమును జేయవలెనని సంక్షేపము.

# ప్రధమ ఋతువు (రజస్వల)

రాజోదర్శనము అనగా స్త్రీ రజస్వల అగుట. ప్రధమ రాజోదర్శనమునకు వాడుకలో సమర్థ, పుష్పవతి, పెదామనిషి అయినదని కూడా అంటారు. నెల నెల రాజోదర్శనమును బహిష్టు అంటారు. ప్రధమ రజస్వల ప్రాత: కాలమునుంచి మధ్యాహ్నములోపు అయిన శుభము. మిగిలిన కాలము అశుభము.

**రాజస్వలకు దుష్ట తిధులు:** అమావాస్య, ఉభయ పాద్యమిలు, షష్టి, అష్టమి, ద్వాదశి తిదుల యందును పరిఘు యోగముల పూర్వార్ధమునందును, వ్యతీపాత, వైధృతి యోగాములందును, సంధ్యా కాలమునందును, ఉప్పెన, భూకంప మొదలైన వుపద్రవ కాలమందును భద్ర కారణమూ నందును మొదటిసారి రజస్వల అయిన శుభకరము కాదు.

**వారఫలము:** సోమ, బుధ, గురు, శుక్ర వారములందు ప్రధమ రజస్వల అయిన శుభ ఫలము, ఆది, మంగళ, శని వారములందు అశుభ ఫలము కలుగుతుంది.

**శుభ నక్షత్రములు:** అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ , శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి యీ నక్షత్రములందు ప్రధమ రజస్వల అయిన సౌభాగ్యము, సౌఖ్యము, సంతానము, ఆయువు, ధనము కలుగుతుంది. మిగిలిన నక్షత్రములు అశుభ ఫలములు ఇచ్చును. కావున శాంతి చేయాలి. రజస్వల కాకుండానే వివాహాలు జరిపించే పూర్వపు రోజుల ప్రకారము భర్త యొక్క జన్మ నక్షత్రమినాను హాని అని చెప్పబడినది.

దుష్ట నక్షత్రములందు ప్రధమముగా రజస్వల అయినపుడు హెూమయుక్తమైన శాంతి జరిపించి దానాదులు నిర్వహించి తిరిగి షుహ నక్షత్రములో రజోదర్శనమైన తదుపరి శుభ ముహూర్త కాలమందు గర్భాదానము చేయాలి. ఆ విధంగా చేసిన యెడల సంతాన ప్రాప్తి కలుగుతుంది మరియు గ్రహణ సమయములందు, సంక్రాంతి యందు, అశుభమైన నిద్రా సమయములందు, అర్ధరాత్రి యందు ప్రధమ రజస్వల అయినచో యుక్తమైన శాంతులు నిర్వహించాలి.

**శుభ తిధులు:** తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పౌర్ణమి తిధులు శుభము.

**లగ్న గ్రహఫలము:** ప్రదమ రాజోదర్శన సమయమున కేంద్ర, కోణ, లాభ స్థానములందు శుబ గ్రహములు, తృతీయ, షష్ట లాభ స్థానములందు క్రూర గ్రహములు శుభ ఫలములిస్తాయి. చంద్రుడు అష్టమ స్థానమునందు వుండిన పతి నాశనము కలుగ జేస్తాడు కాని చంద్ర తారాబలములు సంపన్నమైనపుదు పుత్ర, ధన సంపత్తులు కలుగుతాయి. కుజుడైనాను లేక చంద్రుడైనాను లగ్నమునకు 3, 6, 10 స్తానములన్దున్నచోసంపంనులగు కుమారులు కలుగుతారు.

**నక్షత్ర గ్రహ ఫలము:** రజస్వలా సమయ నక్షత్రమందు గురుడుగాని, శనిగాని వున్నాను, యే గ్రహము లేకున్నను శుభము. రజస్వలా సమయ నక్షత్రము నందు కుజుడున్నను బుధ శుక్రులు కలిసి వున్నాను, రవి వున్నాను రాహు కేతువులున్నను అశుభము.

**రాజోదర్శన స్థాన ఫలితము:** తన యింటి యందును, గోడల చావిదియందును, స్వగ్రామ మధ్యమందు, జల సమీపమున, ఇంటి ఆవరణ మధ్య ప్రధమ రజస్వల అయిన శుభము. గ్రామము బయట, ఇతర గ్రామములందు, నగ్నముగా వున్నపుడు ఇతరుల యిండ్లలోను ప్రదమ రజస్వల అయిన అశుభము.

**వేళా విశేషములు:** ప్రాత: కాలం చిర సౌభాగ్యం, ఉష: కాలం శోవ్భాగ్య లోపం, పూర్వాహ్నం పుణ్య క్షేత్ర దర్శనం, మధ్యాహ్నం ధనవతి, పుత్రవతి, సాయంత్రం జారగునం, సంధ్యలందు చేడుప్రవర్తన కలది, అర్ధరాత్రి బాల వైధవ్యం కలుగును.

**రాత్రి వేళ నిర్ణయం:** రాత్రి రజస్వల అయినచో రాత్రిని మూడు భాగాలుగా చేసి రెండు భాగముల కాలము పూర్వదినము, మూడవ భాగాకాలమున తదుపరి దినమునకు చెందుతుంది.

**వస్త్రఫలము:** తెల్లబాట్ట కట్టుకొని రజస్వల అయిన సౌభాగ్యవతి, గట్టి బట్ట కట్టుకొని రజస్వల అయిన పతివ్రతయు, దుకూల వస్త్ర దారియైన పట్టపురాణి యగును, నూతన వస్త్రము ధరించాగానే శుభ సంపన్నురాలగును, చిరిగినా బట్ట కట్టుకొనిన దౌర్భాగ్య రాలగును, యెర్రని బట్టకట్టుకోనిన వ్యాధి గ్రస్తు రాలగును నల్లని వస్త్రము ధరించినదైన దరిద్రురాలగును.

**రజస్వలా శుద్ధి:** రాజోవతి అయిన స్త్రీ మొదటి దినమునందు చండాల స్త్రీ సమానురాలు, రెండవ దినమందు పతితురాలితో సమానురాలు, మూడవ దినమునందు చాకలి స్త్రీతో సమానము, నాలుగవ దినమున కూడా శూద్ర స్త్రీ సమానురాలు, ప్రథమ రజస్వల అయిన స్త్రీ అయిదవ దినమందు దేవ పిత్రు కార్యములందు పరిశుద్ధురాలూ అన్నారు. నాలుగవ దినమందు స్నానముచేత శుచి కాగలదు. బహిష్టు అయిన స్త్రీ మూడు రోజుల తరువాత శుద్ధి అవుతుంది. తిరిగి మళ్లి పంతొమ్మిది రోజులలో బహిష్టు అయిన ఒక దినముతో శుద్ధి అట్లు గాక ఇరవై రోజుల అనంతరము ఎప్పుడైనా బహిష్టు అయిన మూడు రోజుల తరువాత శుద్ధి అగును.

ప్రథమ రజస్వల అయిన కన్యకు అక్షతలు తలపై వేసి ఆసనమేసి కూర్చుండ బెట్టాలి దీపమున్న గదిలోనే కన్యను ఉంచాలి. సువాసినులకు శ్రీ గంధము, పుష్పములను, తమ్మూలములను లవణము, పెసలు మొదలగునవి ఇవ్వాలి. ప్రథమ రజస్వల అయిన వస్త్రముతోనే మూడు రోజులు ఉంచాలి. ఎవరిని తాకకుండా జాగ్రత్త గా, ప్రశాంతముగా, ఉండునట్లు చూడాలి. భోజన విషయంలో పులగము, నెయ్యి, పాలు వంటి సాత్విక ఆహారము ఉప్పు, పులుపు, కారము లేకుండా ఇచ్చుట మంచిది, నాలుగవ రోజు స్నానము చేయించి నూతన వస్త్రములు కట్టించాలి

**సర్వ ఋతువులకు సాధారణ నియమములు:** మూడు దినములు ఎవరిని తాకకూడదు. అభ్యంగనము, కాటుక, స్నానము, పగలు నిద్రించుట , అగ్ని ముట్టుట ప్రాసనము, సూర్యావలోకనము, భూమిపై గీతాలు గీయుట చేయుట చేయకూడదు. క్రింద పడుకోవాలి, ఆవుపాలు, పెరుగు, మజ్జిగ, తాంబూలము, గంధమాల్యములు ఉపయోగించరాదు. ఇవన్నీ ఆరోగ్యము కొరకు పాటించే నియమములు.

మంచి పాదములలో జన్మించిన లఘు శాంతి చేయించవలె... మంచిదై తక్కిన తిథి మొదలగునవి చెడువైనను సామాన్య శాంతి చేసికొనవలయును.

## శాంతుల క్రమము

చెడు నక్షత్రము చెడుసమయముల యందు స్త్రీలు ప్రథమ రజస్వల అయినప్పుడు – గండ నక్షత్రములలో శిశు జననమైనప్పుడు శాంతులు చేయవలెను.

**1. ఆజ్యావేక్షణము :** దీనినే నూనెలో ముఖము చూచుట అని అందురు. ఇత్తడి, కంచు, మట్టి పాత్రలలో తగినంత నువ్వుల నూనెను పోసి అందులో రాగి పైస ఉంచాలి. ఇట్టి రాగి పాత్రను ఒకచోట నుంచి దంపతులు సంకల్ప పూర్వకముగా ముందు గణపతినీ పూజించి పిమ్మట నూనెను పోసిన పాత్రను పూజించాలి. ఆ నూనెలో ఒకరి ముఖమును మరియొకరు చూడవలయును. శిశు ముఖమును కూడ చూడవలయును.

**2. రుద్రాభిషేకము :** గోచారమున శని దుష్టస్థానములలో ఉన్నప్పుడు, చెడు నక్షత్రములలో శిశువు జన్మించినప్పుడు – కాలము గడ్డుగా ఉన్నప్పుడు రుద్రాభిషేకము చేయించుకొనవలయును – స్తోమతకు – సమయమునకు తగునట్లుగా బ్రాహ్మణులను నియమించుకొని మహాన్యాస పూర్వముగ 11 పర్యాయములుగాని 11 × 11 = 121 పర్యాయములుగాని శివాభిషేకము చేయించవలయును – తగినన్ని కొబ్బరికాయలు – పరిమళ ద్రవ్యాలు – రసద్రవ్యాలు – ఆవుపాలు మున్నగునవి యధాశక్తిగా సంపాదించు కొని అభిషేకము చేయించాలి. 108 నామములతోగాని, 1008 నామములతోగాని పూజించాలి. పిమ్మట బ్రాహ్మణులను భోజన, తాంబూల, దక్షిణలతో సంతోషపరచి వారి యాశీస్సులను పొందవలయును.

3. సూర్య నమస్కారములు : రాగి చెంబు - రాగి పాత్ర - రాగి పళ్ళెము - రాగి ఉద్ధరిణి - ఎర్రని పువ్వులు - ఎర్రనిపట్టు (పిండి) కావలయును - అరుణ మంత్రమును - (సూర్యమంత్రమును) జపము చేయవలయును - ఎండలోగాని, ఇంటిలోగాని ఒంటికాలిపై నిలబడి అరుణము పారాయణ చేయవలయును - ఇందులకు యథాశక్తిగా బ్రాహ్మణులను నియమించి సంతర్పణలతో యథాశక్తి దక్షిణ తాంబూలములతో సంతృప్తి పరచవలయును అదే సమయమున మరియొకరిచే రామాయణము నందలి ఆదిత్య హృదయమును ముమ్మారు పారాయణ చేయించిన దుష్టత-శ్వేతము మున్నగునవి తొలగి ఆరోగ్యవంతులై తేజోవంతులగుదురు.

4. మృత్యుంజయ జపము : జాతకమున దుష్టదశలు జరుగుచున్నప్పుడు అనారోగ్యవంతులై యుండగను, గోచారము కూడా చెడ్డదిగా ఉన్నప్పుడు, ఏక్సిడెంటు ప్రమాదములు వచ్చినప్పుడు మృత్యుంజయ జపము చేయించవలయును. దీనివలన అకాలమరణము తప్పును. శక్త్యానుసారముగా వేదపండితులను నియమించి లక్ష పర్యాయములు మృత్యుంజయ జపమును సాంప్రదాయముగా చేయించవలయును. ఇట్లు చేసిన అకాలమరణము తప్పును.

5. నక్షత్ర జపము : జనన నక్షత్రముగాని - రజస్వల నక్షత్రముగాని దుష్టమయినపుడు 8 వాక్యములు గల మంత్రమును 8 వేలు జపము చేయించ వలయును - ఆ నక్షత్రమునకు వెనుకటి - ముందు నక్షత్రములకు 8 వందల చొప్పున జపము చేయించి తర్పణము - హోమము - దానములను ఇచ్చి యథాశక్తిగా సమారాధన చేసి తాంబూల దక్షిణలతో బ్రాహ్మణులను తృప్తి పరచి వారి ఆశీస్సులు పొందవలయును. ఈ జపము చేయువారు రోజునకు ప్రధాన నక్షత్రమునకు ఎంత జపము చేయుదుమో ఊహించుకొని అందు దశాంశమును పూర్వాంగమును ముందుగా జపించి, తరువాత ప్రధాన నక్షత్రమునకు జపము చేసి పిమ్మట ఉత్తరాంగ నక్షత్రమునకు దశాంశమును జపము చేయవలయును. కాని లోకములో ప్రధాన నక్షత్రమునకు 8 వేలు జపము చేసి, తరువాత పూర్వాంగ నక్షత్రమునకు 8 వందలు- తరువాత ఉత్తరాంగ నక్షత్రమునకు 8 వందల జపము చేయుట కలదు - ఇందే ప్రకారముగా చేసినను దోషము లేదు.

6. నవగ్రహ జపము : శక్త్యనుసారము బ్రాహ్మణులను నియమించి తొమ్మిది గ్రహములలో దుష్టమైన గ్రహములకు దశా సంవత్సరముల అనుసరించి అన్ని వేల పర్యాయములు ఆయా గ్రహములకు జపము చేయించి తర్పణ హోమదానముల నాచరించి యథాశక్తిగా సమారాధన తాంబూల దక్షిణలతో తృప్తి పరచవలయును.

7. హోమము : నవగ్రహ మంత్రములతోను, జపము చేయించిన నక్షత్ర మంత్రముతోను గ్రహమునకు చెప్పిన సమిధలతోను (లేక) ద్రవ్యములతో భక్తితో హోమగుండమున నుంచవలయును.

8. సువాసినీ పూజ : వ్రత విధానములో చెప్పబడినంతమంది ముత్తైదువులను నియమించి - వారందరకు అభ్యంగనము చేయించి పాదములకు పసుపు రాసి యథాశక్తిగా పిండి వంటలతో భోజనము పెట్టి - తాంబూలము - చీర - రవికల గుడ్డ - పువ్వులు - పండ్లు, గాజులు, కాటుక మున్నగునవి సమర్పించి ఆ ముత్తైదువుల పాదములకు నమస్కరించి వారి ఆశీస్సులను పొందవలయును.

9. సమారాధనము : పైన తెలిపిన జపము - తర్పణము - హోమము - పూజలు చేయించినపుడు షడ్రసోపేతమైన వంటకములతో బ్రాహ్మణ సమారాధనము చేయాలి.

# నామకరణ విషయమై మాసనామములు

| | చాంద్ర మాసములు | వేదోక్తమాస నామములు | [illegible] | [illegible] |
|---|---|---|---|---|
| 1. | చైత్రము | మధుః | విష్ణుః | [illegible] |
| 2. | వైశాఖము | మాధవః | అనంతః | [illegible] |
| 3. | జ్యేష్ఠము | శుక్రః | అచ్యుతః | [illegible] |
| 4. | ఆషాఢము | శుచిః | చక్రీ | [illegible] |
| 5. | శ్రావణము | నభః | వైకుంఠః | [illegible] |
| 6. | భాద్రపదము | నభస్యః | జనార్దనః | ఇందుమతి |
| 7. | ఆశ్వయుజము | ఇషః | ఉపేంద్రః | చంద్రావతి |
| 8. | కార్తీకము | ఊర్జః | యజ్ఞపురుషః | లక్ష్మీ |
| 9. | మార్గశిరము | సహః | వాసుదేవః | వాగ్దేవి |
| 10. | పౌష్యము | సహస్యః | హరిః | పద్మావతి |
| 11. | మాఘము | తపః | గోవిందః | శ్రీదేవి |
| 12. | ఫాల్గుణము | తపస్యః | పుండరీకాక్షః | సావిత్రి |

# నక్షత్రములు - అధిపతులు

| | నక్షత్రము | అధిపతి | | నక్షత్రము | అధిపతి |
|---|---|---|---|---|---|
| 1. | అశ్వినికి | అశ్వినీదేవతలు | 15. | స్వాతికి | వాయువు |
| 2. | భరణికి | యముడు | 16. | విశాఖకు | ఇంద్రాగ్నులు |
| 3. | కృత్తికకు | అగ్ని | 17. | అనూరాధకు | మిత్రుడు |
| 4. | రోహిణికి | బ్రహ్మ | 18. | జ్యేష్ఠకు | ఇంద్రుడు |
| 5. | మృగశిరకు | చంద్రుడు | 19. | మూలకు | రాక్షసుడు |
| 6. | ఆర్ద్రకు | రుద్రుడు | 20. | పూర్వాషాఢకు | జలము |
| 7. | పునర్వసుకు | అదితి | 21. | ఉత్తరాషాఢకు | విశ్వేదేవతలు |
| 8. | పుష్యమికి | గురుడు | 22. | అభిజిత్తునకు | బ్రహ్మ |
| 9. | ఆశ్లేషకు | పాము | 23. | శ్రవణమునకు | విష్ణువు |
| 10. | మఘకు | పితృదేవతలు | 24. | ధనిష్ఠకు | వసువులు |
| 11. | పుబ్బకు | భగుడు | 25. | శతభిషమునకు | వరుణుడు |
| 12. | ఉత్తరకు | అర్యముడు | 26. | పూర్వాభాద్రకు | అజైకపాదుడు |
| 13. | హస్తకు | రవి | 27. | ఉత్తరాభాద్రకు | అహిర్బుధ్నుడు |
| 14. | చిత్తకు | త్వష్ట | 28. | రేవతికి | పూషయను సూర్యుడు |

# శిశుజననము - నక్షత్రపాద దోషములు

| నక్షత్రము | 1వ పాదము | 2వ పాదము | 3వ పాదము | 4వ పాదము |
|---|---|---|---|---|
| అశ్విని | మంచిదికాదు | మంచిది | మంచిది | మంచిది |
| భరణి | మంచిది | మంచిది | చెడ్డది | మంచిది |
| కృత్తిక | మంచిది | చెడ్డది | మంచిది | మంచిది |
| రోహిణి | తల్లి + మే॥మా | తల్లి + మే॥మా | మేనమామ | మేనమామ |
| మృగశిర | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| ఆర్ద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పునర్వసు | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పుష్యమి | మంచిది | చెడ్డది | చెడ్డది | మంచిది |
| ఆశ్రేష | మంచిది | ధనహాని | తల్లి గండం | తండ్రి గండం |
| మఘ | చెడ్డది | మంచిది | చెడ్డది | మంచిది |
| పూర్వఫల్గుని | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఉత్తరఫల్గుని | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| హస్త | మంచిది | మంచిది | చెడ్డది | మంచిది |
| చిత్ర | చెడ్డది | చెడ్డది | మంచిది | మంచిది |
| స్వాతి | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| విశాఖ | మంచిది | మంచిది | మంచిది | చెడ్డది |
| అనూరాధ | మంచిది | మంచిది | చెడ్డది | మంచిది |
| జ్యేష్ఠ (★) | | | | |
| మూల | తండ్రి గండం | తల్లి గండం | ధనహాని | మంచిది |
| పూ.షాఢ | మంచిది | మంచిది | చెడ్డది | మంచిది |
| ఉ.షాఢ | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| శ్రవణం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ధనిష్ఠ | మంచిది | చెడ్డది | మంచిది | మంచిది |
| శతతార | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| పూ.భాద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఉ.భాద్ర | మంచిది | మంచిది | మంచిది | చెడ్డది |
| రేవతి | మంచిది | మంచిది | మంచిది | చెడ్డది |

(★) జ్యేష్ఠ యొక్క ఋక్షాద్యంతమును 11చే భాగించవలయును - అందే భాగమయినదో ఆ భాగము యొక్క ఫలమును తెలిసికొనవలయును - 1వ భాగం తల్లి యొక్క తల్లికి గండం, 2వ పాదం తల్లి యొక్క తండ్రికి, 3వ భాగం మేనమామకు, 4వ భాగం తల్లికి, 5వ భాగం శిశువుకు, 6వ భాగము తన వంశనాశనం, 7వ భాగము తల్లిదండ్రుల వంశనాశనం, 8వ భాగం సోదరగండం, 9వ భాగం అత్తగారికి గండం, 10వ భాగం సర్వనాశనము చేయును - 11వ భాగం మిక్కిలి దుష్టమయినది.

# శాంతి నక్షత్రములు - తిథులు - లగ్నములు మున్నగునవి

అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, పుష్యమి, ఆశ్రేష, మఘ, హస్త, చిత్ర, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, ఉత్తర శతతార, ఉత్తరాభాద్ర, రేవతి అను నక్షత్రములు శాంతి నక్షత్రములు - వీనిలో రోహిణి జ్యేష్ఠ మూలలు మిక్కిలి దుష్టనక్షత్రములు. మూల మొదటి పాదములో మొదటి 4 ఘడియలు అత్యంత దోషము. చెడ్డది అను దోషములో పుత్రజననమయిన తండ్రికి గండము - స్త్రీ శిశువైన తల్లికి గండము.

మీన మేషములకు; కర్కాటక సింహములకు; వృశ్చిక ధనుస్సులకు సంధి 12 నిమిషములు ప్రబల శిశుగండము. ఈ గండాంతమున జన్మించినవారు సర్వ సాధారణముగ బ్రతుకుట కష్టము-ఒకవేళ జీవించినచో ఏనుగులు- గుఱ్ఱములు- కారులు గల మహారాజంతటి వాడగును. పంచమి షష్ఠులకు; దశమ్యేకాదశులకు; పూర్ణిమా అమావాస్యా ప్రతిపత్తులకు సంధి 48 నిమిషములు మరియు బహుళ 14·8 అరువంతులలోను మొదటి ఆరవవంతుగాక మిగిలిన 5 భాగములలోను జన్మించినను, అమావాస్య, - అక్కల, అన్నల నక్షత్రములలో జన్మించినను వ్యతిపాత - వైధృతి - పరఘ - వ్యతిపాత, వైధృతిపాత అను మహాపాతల సమయములయందు, వర్జ్యము- దుర్ముహూర్త సమయములలోను గ్రహణసమయములయందును - పేగు మెడలో వేసికొని పుట్టినను; దంతములతో పుట్టినను, కవల పిల్లలు పుట్టినను, శాంతి విధానమున శాంతి చేసికొనవలయును. తల్లిదండ్రుల నక్షత్రములలో పుత్ర జనన మయినను, పుత్రికా జననమయినను, గోముఖ ప్రసవ శాంతి చేసికొన వలయును - పైన తెలిపిన దుష్ట కాలములలో జననమయినను నక్షత్ర జపము హోమము - తర్పణము నవధాన్యముల దానమిచ్చుట, సమారాధనము, శివాభిషేకము మొదలగు సంపూర్ణ శాంతి చేయవలయును. దుష్ట నక్షత్రములలోని దుష్ట పాదములలో గాక మంచి పాదములలో జన్మించిన లఘు శాంతి చేయించవలయును - నక్షత్రము మంచిదై తక్కిన తిథి మొదలగునవి చెడువైనను సామాన్య శాంతి చేసికొనవలయును.

# అథ - భువనేశ్వరీ శాంతి ప్రయోగః

—o—

ఓం

కన్య ప్రథమ రజస్వల యైనపుడు - తిథి వార నక్షత్ర లగ్నాదులన్నియు దుష్ట ఫలము నిచ్చునవై యున్నపుడు ఈ శాంతి చేసికొనిన తదనిష్ట నివారణమగును. మామూలు శాంతులు చాలవు. వివాహమై యున్న యెడల భర్తయు, కాని యెడల తలి దండ్రులే శాంతి కర్తలు.

ప్రాతః కాలే స్నానసంధ్యావందనాది యావదనుష్టానంకృత్వా శుభ్రవస్త్రం ధృత్వా, ఆదౌ దీపారాధనం కుర్యాత్, పత్నీ ముత్తరత ఉపవేశ్య స్వయం దక్షిణత ఆసీనః। అంతరతః పటం కృత్వా। ప్రార్థనం కుర్యాత్ - హరిః ఓం దేవీం వాచమ జన యంత ... నుప సుష్టుతైతు । అయం ముహూర్త స్సుము హూర్తో అస్తు ... ఫలసిద్ధి రస్తు ॥

శ్లో॥ యశ్శివో నామ రూపాభ్యాం ... జయమంగళం ॥ శుక్లాం బరధరం విష్ణుం... శాంతయే॥ తదేవ లగ్నం ... నారాయణీ

నమోస్తుతే ॥ శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః ... సర్వే భ్యో మహా జనేభ్యో నమః ॥ ఉభా వాచమ్య ॥ ఏవంగుణ... శుభతిథౌ శ్రీమతః గోత్రస్యనామధేయస్య (మమ) ధర్మ పత్న్యాః అముక నామధేయ వత్యాః అముక నక్షత్రచరణే ప్రథమరజోదర్శనేనదుష్టమాసాది సూచిత సర్వానిష్ట శాంత్య ర్థం స గ్రహమఖాం రజోదర్శన శాంతిం కరిష్యమాణ స్తదం గత్వేన తదాదౌ శుధ్యర్థంవృధ్యర్థం ... పుణ్యాహవాచనం కరిష్యే ॥ ఆదౌ నిర్విఘ్నేన పరి ... శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే గణాధి పతి పూజాం పుణ్యాహ వాచనం కృత్వా - పునస్సంకల్ప్య ముఖావ లోకనం కుర్యాత్ ॥

ఆచమ్య ఏవం ... శుభతిథౌ శ్రీమతః అముక గోత్రస్యనామ ధేయస్య (మమ) ధర్మపత్న్యాః అముక నక్షత్ర చరణేయుక్త గండే ప్రథమ రజో దర్శనేన యోదోష స్సముజని తద్దోషపరి హార ద్వారా ఆవయో స్సకలగండ దుర్దోష పరిహారార్థం శౌన కోక్త భువనేశ్వరీ శాంత్యంగ (మమ) ధర్మపత్నీ ముఖావలోక నాఖ్యం కర్మ కరిష్యే ॥

సూ॥ తతః తామ్రఖండ సంయుక్త తిల తైల పూరిత కాంస్యపాత్రే రూపగ్ం రూపమితి ధర్మపత్నీ ముఖావ లోకనం కుర్యాత్ ॥

మంత్రం :- రూపగ్ం రూపం ... ... ... శతాదశ ॥

శ్లో॥ కళ్యాణ జనకం పుణ్యం ... ... కుర్యాదాజ్యావ లోకనమ్॥ యజమానస్య ధర్మపత్నీ ముఖావలోకన ముహూర్త స్సుము హూర్తోఽస్తు. సుముహూర్తకాలే సూర్యా ... సిద్ధిరస్తు ॥ పటము త్తరతో ఽపాస్య - సిరీక్షితాజ్యేన శివాలయే దివ్యసన్ని ధావన్యత్రవా దీపారాధనం కుర్యాత్ ॥

శ్లో॥ తండులాఢక మిశ్రంస్యాత్ ...మిత్యభి ధీయతే ॥ తతః నాందీ శ్రాద్ధం మాతృకా పూజనంచ కృత్వా। ఆచార్య మృత్విజశ్చ వృణుయాత్ ॥

ఆచమ్య - ఏవంగుణ - శుభతిథౌ శ్రీమతః గోత్రస్య నామ ధేయస్య (మమ) ధర్మపత్న్యాః అముక నక్షత్ర చరణేయుక్త గండే ప్రథమ రజోదర్శనేన దుష్టమాసాది సూచిత సర్వానిష్ట శాంత్యర్థం ఆవయో స్సకల గండదోష పరిహారార్థంచ స గ్రహా మఖాం రజోదర్శన శాంతిం కరిష్యే ॥ తదంగత్వేన ఆచార్య బ్రహ్మఋత్విగ్వరణం కరిష్యే ॥ మయా సంకల్పితే శౌనకోక్త రజోదర్శన శాంతి కర్మణి ఆచార్యం త్వామహాం వృణే। వృతోఽస్మికరిష్యామి॥ మయా...శాంతికర్మణి బ్రహ్మాణంత్వామహాం వృణే ... వృతోస్మి కరిష్యామి ॥

మయా... శాంతి కర్మణి అధిదేవతా ప్రత్యధి దేవతాసహిత అముక నక్షత్ర జప మస్మదర్థం భవంతః కుర్వంతు॥కరిష్యామః ఇతి ప్రతివచన మృత్విజాం ॥

మయా ... శాంతి కర్మణి భువనేశ్వరీ ప్రీతయే గాయత్రీ మంత్రజప మస్మదర్థం భవంతః కుర్వంతు - కరిష్యామః ॥
మయా ... శాంతి కర్మణి సకల దేవతా స్వరూప సపరివార

శ్రీ మృత్యుంజయ సదాశివ ప్రీత్యర్థ మేకాదశవార రుద్రాభిషేకం అస్మదర్థం భవంతః కుర్వంతు - కరిష్యామః ॥

ఆచమ్య - ఏవంగుణ ... శుభతిథౌ శ్రీమతః గోత్రస్య నామ ధేయస్య ధర్మపత్న్యాః అముక నక్షత్ర చరణే ప్రథమ రజో దర్శనేన దుష్టమాసాది సూచిత సర్వానిష్ట పరిహార ద్వారా ఆవయో స్సకలగండ దుర్దోష పరిహారార్థం శౌనకోక్త భువనే

శ్వరీ శాంత్యంగ కుంభత్రయా వాహనం కరిష్యే। ఆదౌ నవ గ్రహారాధనంచ కరిష్యే ॥

## కుంభత్రయ సంస్థాపనమ్

తతః ఆచార్య ఐశాన మధ్యే దక్షిణోత్తరయోశ్చ మహీద్యౌరితి మంత్రేణ భూమిం స్పృష్ట్వాఽభి మంత్రయేత్ ॥

మహీద్యౌః పృథివీచన ఇమం యజ్ఞం మిమిక్షతాం పిపృతాన్నో భరీమభిః ॥ తతః ఓషధయ స్సమితి వ్రీహిభిః ద్రోణ ప్రమాణ రాశిత్రయం కల్పయిత్వా ॥

మంత్రం :- ఓషధయ స్సంవదంతే సోమేనసహ రాజ్ఞా యస్మైకరోతి బ్రాహ్మణ స్తగ్ం రాజన్ పారయామసి ॥

తస్మిన్ రాశిత్రయేఽపి మధ్యమే - దక్షిణోత్తరయోశ్చ ఆకలశేష్వితి కుంభత్రయం మంత్రావృత్యా సంస్థాప్య ॥

ఆకలశేషు ధావతి...ర్యజ్ఞేషు వర్ధతే ॥ ఇతిమధ్యే భువనేశ్వరీ కలశం సంస్థాప్య ॥ ఆకలశేషు ...వర్ధతే ... తతః దక్షిణతః ఇంద్రాణీ కలశం సంస్థాప్య ॥ ఆకలశేషు...వర్ధతే తతః ఉత్తరతో ఇంద్ర కలశం సంస్థాప్య ॥

తతః ఇమంమే గంగే త్యనువాకేన కుంభత్రయంజలేనాపూర్య

మంత్రం :- ఇమంమే గంగే యమునే సరస్వతి ... పరుష్ణియాస్సగం శిశాధి॥ గంధద్వారామితి గంధం- గంధద్వారాంధురా ధర్షాం ... హ్వయే శ్రియమ్ ॥

సూ॥ యా ఓషధయ ఇతి సర్వౌషధీః ॥

మంత్రం :- యా ఓషధయ స్సోమ రాజ్ఞీః...న పరిష్యాతి పూరుషః॥

సూ॥ ఓషధయ స్సంవదంత ఇతి యవాంచ్ఛ త్రిషు భాండేషు నిక్షిప్య

మంత్రం :- ఓషధయ స్సంవదంతే...రాజన్ పారయామసిఇతి.

ఔదుంబర-కుశ-దూర్వా-రక్తోత్పలచంపక- బిల్వ-విష్ణుక్రాంత తులసీ - బర్హిష - శ్వంఖ - పుష్ప - శతావర్య - శ్వగంధి- నిర్గుండీ-రక్తపీత సర్షపా-ఽపామార్గ-పలాశ - పనస- బంధూక ప్రియంగు - గోధూమ - వ్రీహ్య - శ్వత్థ - దధి - దుగ్ధ- ఘృత - పద్మపత్ర - నీలోత్పల - సితరక్తపీత కురంటక - గుంజావచా - భద్ర ముస్త కాఖ్యాని ద్వాత్రింశ దౌషధాని యథా సంభవంవా నిక్షిపేత్ ॥

సూ॥ తతః త్రిషు కలశేషు కాండాత్కాండా దితి దూర్వాం నిక్షిపేత్ ॥

మంత్రం :- కాండాత్కాండాత్ ... హవిషా వయమ్ ॥

సూ॥ అశ్వత్థేవ ఇతి పంచపల్లవాని నిక్షిపేత్ ॥

మంత్రం :- అశ్వత్థేవో నిషదనం... ఓషధీర్ హస్త ఆదధే ॥

సూ॥ స్యోనా పృథివీతి సప్త మృదః ప్రక్షిపేత్ ॥

మంత్రం :- స్యోనా పృథివి ... ... ... ... శ్శర్మ సప్రథాః ॥

సూ॥ యాః ఫలినీరితి ఫలం నిక్షిపేత్ ॥

మంత్రం :- యాః ఫలనీర్యా ... త్వగ్ం హసః ॥

సూ॥ సహిరత్నానీతి పంచరత్నాని ప్రక్షిప్య.

మంత్రం :- సహిరత్నాని దాశుషే సువాతి సవితాభగః తం భాగం

చిత్రమీమహే ॥

సూ॥ హిరణ్యరూపేతి హిరణ్యం నిక్షిప్య ॥

మంత్రం :- హిరణ్యరూప స్సహిరణ్యసన్దృగపాన్న పాత్సేదు హిరణ్య

వర్ణః హిరణ్యయాత్పరియోనే ర్నిషద్యా హిరణ్యదాద దద్య

న్నమస్మై ॥

సూ॥ యువాసువాసా ఇతి వస్త్రేణా వేష్ట్య ॥

మంత్రం :- యువాసు వాసాః పరివీత ఆగాత్స ఉశ్రేయాం భవతి

జాయమానః తం ధీరాసః కవయ ఉన్నయంతి స్వాధియో

మనసా దేవయంతః ॥

సూ॥ పూర్ణా దర్వీతి కుంభత్రయం వస్త్రాచ్ఛాదనాద్యలంకరణం కుర్యాత్ ।

మంత్రం :- పూర్ణాదర్వీ పరాపత సుపూర్ణా పునరాపత వస్నేవ వి క్రీణావహా ఇషమూర్జగ్ం శతక్రతో ॥

సూ॥ తత్ర మధ్యమ కుంభే గాయత్ర్యా భువనేశ్వరీ మావాహ్య ।

మంత్రం :- ఓం భూర్భువస్సువః ... ప్రచోదయాత్ ॥ ఇతి భువనేశ్వరీ మావాహయామి ... స్థాపనానంతర ... నీయమ్ ।

సూ॥ దక్షిణ కుంభే ఇంద్రాణీ మితీంద్రాణీ మావాహ్య ॥

మంత్రం :- ఇంద్రాణీ మాసు ..మరతే పతిః ॥ ఇంద్రాణీమావాహయామి స్థాపయామి ... నీయం ॥

సూ॥ ఉత్తర కుంభే ఇంద్రత్వేతి మంత్రేణ ఇంద్రమావాహ్య-ఇంద్రత్వేతి మంత్రస్య - విశ్వామిత్ర ఋషిః । ఇంద్రో దేవతా । గాయత్రీ ఛందః । రజోదర్శన శాంతి కర్మణి ఉత్తరకుంభో పర్యావాహనే వినియోగః —

మంత్రం :- ఇంద్రత్వా వర్తయా మసి సుబ్రహ్మాణం వీర వంతం బృహంతం। ఉరుం గభీరం పృథు బుధ్న మింద్ర శ్రుతర్షి ముగ్ర

మభిమాతిషాహం॥ అస్మభ్యం చిత్రం వృషణగం రయిందాః ॥

ఇతీంద్ర మావాహ్య తత్తన్మంత్రై షోడశోపచారైః పూజయేత్ ॥

ఆచమ్య పూర్వోక్తైవంగుణ... శుభతిథౌ శ్రీమతః గోత్రస్య నామధేయస్య (మమ) ధర్మపత్న్యాః అముక నక్షత్ర చరణే యుక్తగండే ప్రథమ రజోదర్శనేన దుష్టమాసాది సూచిత సర్వారిష్ట శాంత్యర్థం మయాచరిత సగ్రహ మఖాం భువనేశ్వరీ శాంతి మంటపే ఆవాహిత నవగ్రహాది పరివార దేవతా సహిత శ్రీ భువనేశ్వరీ దేవతా ప్రీత్యర్థం పురుషసూక్త శ్రీసూక్త విధానేన యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోప చార పూజాం కరిష్యే ॥ తదంగ కలశారాధనం కరిష్యే॥ కలశస్యముఖే విష్ణుః ... సన్నిధిం కురు । ఆయాంతు రజోదర్శన శాంత్యంగ భువనేశ్వరీ పూజార్థం(మమ) దురితక్షయకారకాః కలశోదకేన పూజా ద్రవ్యాణి సంప్రోక్ష్య దేవం ఆత్మానంచ యాగోపకరణ ద్రవ్యాణి పూజా ద్రవ్యాణిచ సంప్రోక్ష్య ॥ తదంగ మూర్త్యావాహనం కరిష్యే ॥

మంత్రం :- ఓం భూర్భువస్సువః ... చోదయాత్ ॥ అస్మిన్ మధ్య కుంభే అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత సగ్రహ పరివార దేవతాయుతాం భువనేశ్వరీ మావాహయామి ॥

శ్లో॥ దేవేసి భక్త సులభే సర్వశక్తి సమన్వితే యావత్వాం పూజయిష్యామి తావత్వం సుస్థిరాభవ ॥ ఇత్యావాహ్య ॥ తతః॥ ప్రాణప్రతిష్ఠాం కరిష్యే ॥

అస్య శ్రీ సపరివార భువనేశ్వరీ దేవతా ప్రాణప్రతిష్ఠా మహా మంత్రస్య... యథాస్థాన ముపహ్వాయతే ॥

శ్లో॥ దేవేసి భక్త సులభే ... సుస్థిరాభవ ॥
సపరివార భువనేశ్వరీ దేవతా ఆవాహితా భవతు । స్థాపితా భవతు । సన్నిహితా భవతు । సన్నిరుంధితా భవతు। సుస్థిరా భవతు । సుప్రసన్నా భవతు । అభిముఖీ భవతు । స్థిరాసనం కురుత। ప్రాణప్రతిష్ఠాంగ యావచ్ఛక్తి లఘుపూజాం కృత్వా॥ నీరాజనం దద్యాత్ ॥ పునస్సంకల్ప-పురుషసూక్త శ్రీసూక్త ఋక్సంపుటిత విధానేన మహాపూజాం కృత్వా సమర్పయేత్ ॥

సమర్పణం

శ్లో॥ యస్యాస్స్మృత్యాచ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు న్యూనం సంపూర్ణ తాంయాతి సద్యోవందే మహేశ్వరీం । మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరి-యత్పూజి తం మయాదేవి పరిపూర్ణం తదస్తుతే॥ అనయా ధ్యానావాహ నాది పురుషసూక్త శ్రీసూక్త విధాన భువనేశ్వరీ శాంత్యంగ మహా పూజయాచ భగవతీ సర్వాత్మికా సపరివార శ్రీ భువ నేశ్వరీ దేవతా సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు॥ ఏతత్స ర్వం సపరివార శ్రీ భువనేశ్వరీ దేవతా దివ్య శ్రీ చరణార విందార్పణ మస్తు ॥

సూ॥ తతః ఏకో ఋత్విక్ మధ్యమ కుంభం స్పృష్ట్వా గాయత్రీం సహస్ర మష్టోత్తర శతంవా యథాశక్తి జపేత్ ॥

మంత్రజపమ్

ఓం భూర్భువస్సువః తత్సవితుః ... చోదయాత్ ॥

మూ॥ అథ హిరణ్యవర్ణామితి పంచదశ ఋక్పారాయణం కుర్యాత్॥ అస్య శ్రీ శ్రీసూక్త మహా మంత్రస్య । కర్దమానంద చిక్లీత ఇందిరా సుత ఋషయః శ్రీర్దేవతా । ఆద్యాస్తిస్రోనుష్టుభః ఏకా ప్రసార పంక్తి ర్ద్వేత్రిష్టుభోంత్యా ప్రస్తార పంక్తిః । రజోదర్శన శాంత్యంగ భువనేశ్వరీ ప్రీత్యర్థే జపే వినియోగః।

## శ్రీ సూక్తపారాయణమ్

౧. ఓం హిరణ్య వర్ణాం హరిణీం । సువర్ణ రజతస్రజాం చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మఆవహ॥

౨. తాం మఆవహ జాతవేదో లక్ష్మీ మనప గామినీం యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషా నహమ్॥

౩. అశ్వ పూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీం శ్రియం దేవీ ముపహ్వయే శ్రీర్మాదేవీ జుషతాం॥

౪. కాంసోస్మితాం హిరణ్య ప్రాకారా మార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయంతీం పద్మేస్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియం॥

౫. చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం శ్రియం లోకే దేవ

జుష్టా ముదారాం। తాం పద్మినీమీం శరణమహం ప్రపద్యేఽ

లక్ష్మీ ర్మేనశ్యతాం త్వాంవృణే ॥

౬. ఆదిత్య వర్ణే తపసోఽధి జాతో వనస్పతి స్తవవృక్షోఽథ బిల్వః

తస్య ఫలాని తపసాను దంతు ॥

౭. మాయాంత రాయాశ్చ బాహ్యా అలక్ష్మీః ఉపైతుమాం దేవ

సఖః । కీర్తిశ్చ మణినాసహ. ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్

కీర్తిమృద్ధిం దదాతు మే ॥

౮. క్షుత్పిపాసా మలాం జ్యేష్ఠా మలక్ష్మీ ర్నాశయామ్యహం

అభూతి మసమృద్ధించ సర్వాన్నిర్ణుదమే గృహాత్ ॥

౯. గంధద్వారాందురా ధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం ఈశ్వరీగ్ం

సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియం ॥

౧౦. శ్రీర్మే భజతు అలక్ష్మీర్మేనశ్యతు ॥ మనసః కామమాకూతిం

వాచస్సత్య మశీమహి। పశూనాగ్ం రూపమన్నస్య మయి శ్రీ
శ్రయతాం యశః ॥

౧౧. కర్దమేన ప్రజాభూతా మయిసంభవ కర్దమా । శ్రీయంవాస
యమేకులే - మాతరం పద్మమాలినీం ॥

౧౨. ఆపస్రజంతు స్నిగ్ధాని చిక్లీత వసమేగృహే। నిచదేవీంమాతరం
శ్రియం వాసయమే కులే ॥

౧౩. ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం-పింగళాం పద్మమాలినీం। చంద్రాం
హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మఆవహ ॥

౧౪. ఆర్ద్రాంయః కరిణీం యష్టిం సువర్ణాంహేమమాలినీం।సూర్యాం
హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మఆవహ ॥

౧౫. తాం మఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీం । యస్యాం
హిరణ్యం ప్రభూతం గావోదాస్యోశ్వాన్ విందేయం పురుషా
నహం ॥

సూ॥ తతోన్య ఋత్విక్ - దక్షిణ కుంభే కద్రుద్రాయేతి నవానాం మంత్రాణాం జపం కుర్యాత్ ॥

కద్రుద్రాయే త్యస్య మంత్ర నవకస్య అఘోరః కణ్వో ఋషిః రుద్రో దేవతా । గాయత్రీ ఛందః శౌనకోక్త రజోదర్శన భువనేశ్వరీ శాంత్యంగ దక్షిణ కుంభే జపే వినియోగః ॥

౧. కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే వోచేమశంతమగ్ం హృదే । సర్వోహ్యేష రుద్రస్తస్మై రుద్రాయ నమో అస్తు ॥

౨. యస్యవైకం త్యగ్ని హోత్ర హవణీ భవతి ప్రత్యేవాస్యాహుతయ స్తిష్ఠం త్యథో ప్రతిష్ఠిత్యై ॥

3. అదితిర్దేవా గంధర్వా మనుష్యాః పితరోఽసు రాస్తేషాగ్ం సర్వభూతానాం మాతామేదినీ మహతామహీ సావిత్రీ గాయత్రీ జగత్యుర్వీ పృథ్వీ బహులావిశ్వాభూతా కతమా కాయాసా సత్యేత్యమృతేతి వశిష్ఠః ॥

౪. ఆపోవా ఇదగ్ం...సువరాప ఓం ౫. ఆపః పునంతుపృథివీం ... ప్రతిగ్రహగ్ స్వాహా ॥ ౬. అగ్నిశ్చ మామన్యుశ్చ...

సత్యేజ్యోతిషి జుహోమి స్వాహా॥ ౭. సూర్యశ్చ మామన్యశ్చ

.. సూర్యేజ్యోతిషి జుహోమి స్వాహా ॥ ౮. ఓమిత్యేకాక్ష

రంబ్రహ్మ ... సాయుజ్యం వినియోగం ॥ ౯. ఆయాతువరదా

దేవీ ... సంధ్యావిద్యే సరస్వతి ॥

సూ॥ తతః ఇమాంగ్ రుద్రాయేత్యేకాదశానా మృచాం ప్రత్యేకం త్రివారం జపం కుర్యాత్ ॥ ఇమాగ్ం రుద్రాయేతి మంత్రై కాదశకస్య కుత్సో ఋషిః । రుద్రో దేవతా ॥ జగత్యంతే త్రిష్టుభౌ ఛందసీ । రజోదర్శన శాంత్యంగ జపే వినియోగః ॥

మంత్రం :- ౧. ఇమాగ్ం రుద్రాయ తవసే కపర్దినే ... గ్రామే

అస్మిన్ స్ననాతురం మృడానో రుద్రో .. ప్రణీతా ॥ ౨.

మానోమహాంత...రుద్రరీరిషః ॥ 3. మానస్తోకే ..విధీమతే।

౪. ఆరాత్తే గోఘ్న ... స్తుహి ॥ ౫. శ్రుతంగర్తస ... సేనాః

౬. పరిణో రుద్రస్య ... తనయాయ మృడయ । ౭. మీఢు

ష్టమ శివతమ...బిభ్రదాగహి ॥ ౮. వికిరిదవిలోహిత...నివ

పంతుతాః ౯. సహస్రాణి సహస్రధా ...ముఖాకృధి ॥ ౧౦.

సహస్రాణి సహస్రశో యే రుద్రా ... ధన్వాని తన్మసి॥ ౧౧.

అస్మిన్ మహత్యర్ణ వేంతరిక్షే ... సృకావంతో నిషంగిణః ।

సూ॥ తతః ఆ తేపితరితి పంచదశానా మృచాంచ ఏకైక వారం జపం కుర్యాత్ ॥ ఆ తే పితరితి మంత్ర పంచదసకస్య గృత్స్న మదో ఋషిః। రుద్రో దేవతా। త్రిష్టుప్ ఛందః రజోదర్శనశాంత్యంగ పారాయణ జపే వినియోగః ॥

మంత్రం :- ఆ తేపితర్మరుతాగ్ం సుమ్న మేతు॥ ౨. మానస్సూర్యస్య

సందృశోయుయోధాః ॥ 3. అభినో వీరో అర్వతిక్షమేత ॥ ౪.

ప్రజాయైమహి రుద్రప్రజాభిః॥ ౫. ఏవాబభ్రో వృషభ చేకితానః

౬. యథా దేవన హృణీషేన హగ్ంసి॥ ౭. హావనశ్రుహో

రుద్రేహాబోధి ॥ ౮. బృహద్వదేమ విదథే సువీరాః ॥ ౯ పరి

ణోరుద్రస్య ... తనయాయ మృడయ॥ ౧౦ స్తుహిశ్రుతం గర్త

సదం ... నివపంతు సేనా. ॥ ౧౧. మీఢుష్టమ శివతమ ...

... బిభ్రదాగహి ॥ ౧౨. అర్హన్బిభర్షి సాయకాని ధన్వ...

రుద్రత్వదస్తి ॥ ౧3. మానస్తోకే తనయే...నమసా విధేమతే॥

౧౪. అర్హాన్ బిభర్షి సాయకాని ధన్వ ... రుద్ర త్వదస్తి॥ ౧౫.
త్వమగ్నే రుద్రో ... మవసే కృణుధ్వమ్ ॥

సూ॥ తతః ఇమారుద్రాయేతి చతస్రాసూన్ పఠేత్॥ఇమా రుద్రాయేతి మంత్ర చతుష్టయస్య । గృత్సమదో ఋషిః । రుద్రో దేవతా త్రిష్టుప్ ఛందః । రజోదర్శన శాంత్యంగ పారాయణే వినియోగః ॥

౧. ఇమారుద్రాయ స్థిరధన్వనేగిరః । క్షిప్రేషవే దేవాయస్వ ధామ్నే ॥ ౨. అషాఢాయ సహమానాయ మీఢుషే తిగ్మాయుధాయ భరతా శృణోతన ॥ 3. త్వాదత్తేభీ రుద్రశంతమేభిః । శతగ్ం హిమా అశీయ భేషజేభిః॥ ౪. వ్యస్మద్ద్వేషో వితరం వ్యగ్ంహాఃవఅమీ వాగ్ం శ్చాయ స్వావిషూచీః ॥

సూ॥ తత స్త్ర్యంబక మితి మంత్రం వాచయేత్ త్ర్యంబక మిత్యస్య మంత్రస్య వశిష్ఠ ఋషిః । రుద్రో దేవతా । అనుష్టుప్ ఛందః । భువనేశ్వరీ శాంత్యంగ పారాయణే వినియోగః ॥

మంత్రం :- త్ర్యంబకం యజామహే ... య మామృతాత్ ।

సూ॥ తతో త్తర కుంభే అన్యే ఋత్విజో రుద్రైకాదశినీం జపేత్ -
అస్య రుద్రస్య ప్రశ్నస్య । అఘోర ఋషిః సంకర్షణమూర్తి

స్వహాపో యో సావాదిత్యః పరమపురుష స్సఏషరుద్రో దేవతా జగతీ ఛందః। భువనేశ్వరీ శాంత్యంగ పారాయణే వినియోగః

మంత్రం:- ఓం నమో భగవతే రుద్రాయ. ఓం నమస్తే రుద్రమన్యవ

ఉతోత ఇషవే నమః...నమోరుద్రాయ విష్ణవే మృత్యుర్మే

పాహి ॥ తముష్టుహి యస్స్విషు ... యం శివాభిమర్శనః ॥

అగ్నా విష్ణూ సజోషసేమా వర్ధంతు వాంగిరః ... శోభాయై

పితరోను మదంతు — తచ్ఛంయోరావృణీమహే - శంచ

తుష్పదే ఓం శాంతి శ్శాంతి శ్శాంతి. ॥ సహస్ర శీర్షాపురుషః

... సర్వం మనిషాణ. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః —

సూ॥ శన్నో మిత్ర ఇతి శాంతి మంత్రం త్రివారం జపేత్ ॥ శన్నో మిత్ర ఇత్యస్య మంత్రస్య వశిష్ఠ ఋషిః। విశ్వేదేవా దేవతాః త్రిష్టుప్ ఛందః। భువనేశ్వరీ శాంత్యంగ పారాయణే వినియోగః ॥

మంత్రం :- శన్నోమిత్ర శ్శంవరుణః ... అవతు వక్తారం ॥ ఓం

శాంతి శ్శాంతి శ్శాంతిః ॥

ఈశాన్య దిగ్భాగే - పృథఙ్మంటప మాసాద్య। తస్మిన్నవ గ్రహ దిక్పాలకా ద్యావాహనం కృత్వా।మంటపస్య ఈశాన్య

దిగ్భాగే వరుణ కలశ మావాహ్య - సర్వాసాం మంటప దేవతానాం సమష్ట్యా మహా పూజాం కృత్వా - సమర్పయేత్ ॥
ఆచమ్య - పూర్వోక్తైవంగుణ...శుభతిథౌ శ్రీమతః గోత్రస్య నామధేయస్య (మమ) ధర్మపత్న్యాః నక్షత్రే ముకచరణే ప్రథమ రజోదర్శనేన దుష్టమాసాది సూచిత సర్వారిష్ట పరిహార ద్వారా ఆవయో స్సకలగండ దుర్దోష పరిహారార్థంచ భువనేశ్వరీ శాంత్యం గత్వేన స వారుణ కలశ అముక నక్షత్ర పూర్వకాదిత్యాది నవగ్రహ మంటపా రాధనం కరిష్యే॥ ఇతి సంకల్ప్య నవగ్రహారాధనంమంటప దేవతా సహితం కృత్వా-ఆవాహనాంత లఘుపూజాంచ కుర్యాత్ ॥

## — భువనేశ్వరీ శాంతి హోమ ప్రయోగః —

శ్లో॥ ప్రాచీః పూర్వముదక్సంస్థం ... పరి స్తరాణాం యత్రాగ్ని స్థాప్యతే ... భూర్భువస్సువరోం ॥ అగ్నిమిధ్వా ॥ చత్వారి శృంగాః ॥ ... జాతవేదసే నమః ॥ షట్పాత్ర ప్రయోగం కృత్వా ॥

సూ॥ చక్షుష్యంతే గాయత్ర్యా భువనేశ్వరీం దూర్వా తిలమిశ్ర గోధూమ పాయసాజ్యానా మష్టోత్తరశత అష్టావింశత్యన్యతరాహుతిభి రింద్రాణీ మింద్రంచ ప్రత్యేక ముక్త ద్రవ్యై రష్టావింశత్యన్యత రాహుతిభి స్సమిదాజ్య చరు వ్రీహిభి ర్నవ గ్రహాదీన్ ఇతరా న్నేకై కేనా హుత్యా, యజమానే త్యాగేకృతే ఉక్త సంఖ్యయా హోమం కుర్యాత్ ॥ తత్ర త్రిసృభి ర్దూర్వాభి ర్దధి మధ్వాజ్యాక్తాభి రేకా హుతిః ఏవం సమిధోఽభ్యక్తాః ॥ తత స్రుచ్యుపస్తీర్య । చరుమధ్యా ద్విరవదాయ (చరుమధ్యా దంగుష్ఠ పర్వమాత్రం హవిర్మధ్యమానామికాం

గృహ్యైస్తిరశ్చీన మవదాయ - పూర్వార్థా ద్వితీయ మనూచీనం పశ్చార్ధా తృతీయ మనూచీనం పంచావత్తినః) అభిఘార్య - హవిః ప్రత్యభి ఘారయతి ఓం అగ్నయే స్వాహా ॥ అగ్నయ ఇదం నమమ ॥ పునస్రుచ్యుపస్తీర్య .. ప్రత్యభి ఘారయతి ఓం భూర్భువస్సువః ... చోదయాత్స్వాహా॥గాయత్ర్యా ఇదం॥ ఇతి దూర్వా తిలమిశ్ర పాయసాజ్య ద్రవ్యై రష్టోత్తర శతసం ఖ్యయా జుహుయాత్ ॥ మం ॥ ఇంద్రాణీ మాసు నారిషు... పతి స్వాహా ॥ ఇంద్రాణ్యా ఇదం ॥ ఇత్యష్టా వింశత్యాహుతీః

మంత్రం :- ఇంద్రత్వా వర్తయామసి...రయిందాస్వాహా ॥ ఇంద్రా యేదం ॥ ఇత్యష్టావింశత్యా హుతీః ॥

పూ॥ తతః నవగ్రహాణాముపగ్రహైస్సహ సమిదాజ్య చరుద్రీహిభి రేకై కేన జుహుయాత్ —

అకృష్ణేన ... కేతు గణాయేదం-రేఫస్ త్స్వాహా॥ బ్రహ్మాణ ఇదం॥ఇంద్రంవో...స్వధా స్వాహా ॥ తతః ఉపగ్రహాణాం హవనం కుర్యాత్ ॥ ఇతి హుత్వా ఇధ్మసన్నహనాన్యద్భిః... జయాది హోమం కరిష్యే । చిత్తంచ స్వాహా॥యదస్యకర్మణో త్యరీరి ... సుహుతం కరోతుస్వాహా॥అగ్నయే స్విష్టకృత ఇదం మధ్యమ పరిధిం ప్రహరతి। హస్తాభ్యా మితరా యుగపత్ప్రహ

రన్ । ఉత్తరార్ధస్యాగ్ర మంగారేష్వాహోహతి । పరిధీ నభి మంత్ర్య। ఆఘార సమిధా ప్రహృత్య। తనుభ్య। ఇదంనమమ ॥

సూ॥ విశ్వాన్ దేవానుద్దిశ్య సగ్ప్రావేణాఽభి జుహోతి ॥

మంత్రం :- విశ్వేభ్యో దేవేభ్యో వసుభ్యో రుద్రేభ్యఆదిత్యేభ్యస్సగ్ ప్రావ భాగేభ్య ఇదం నమమ ॥ అస్మిన్ ప్రవృత్తే భువనేశ్వరీ శాంతి హోమ కర్మణి అవిజ్ఞాత ప్రాయశ్చిత్తం కరిష్యే । — అనాజ్ఞాతం ... యజమాన స్యశా మాస్స్వాహా ॥ అగ్నయే వసునీథా యేదం నమమ ॥ సువస్స్వాహా ॥ సూర్యాయేదం నమమ । ఆతమితోః ప్రాణానాయమ్య ఓం భూః ... భూర్భువస్సువరోం । ఏతా వత్పర్యంతం నానా ప్రకారేణ సంభావిత సకల పాప నివృత్త్యర్థం సర్వప్రాయశ్చిత్తం కరిష్యే ॥ ఓం భూర్భువస్సువ స్స్వాహా ॥ ప్రజాపతయ ఇదం నమమ । శ్రీ విష్ణవే స్వాహా - శ్రీ విష్ణవే పరమాత్మన ఇదం నమమ ॥

సూ॥ తతస్సముద్రా దూర్మిరితి పూర్ణాహుతిం దద్యాత్ ॥

### పూర్ణాహుతిః

పూర్వోక్తైవంగుణ ... శుభతిథౌ ॥ అస్మత్కృత భువనేశ్వరీ శాంతి హోమ సంపూర్ణతా సిద్ధ్యర్థం పూర్ణాహుతిం హోష్యే పూర్ణాహుతి ద్రవ్యాధిష్ఠాన దేవతాభ్యో నమః — ధ్యానావాహనాది షోడ ... మి ॥ సముద్రా దూర్మిరిత్యస్య మంత్రస్య

వామదేవ ఋషిః। అగ్నిర్దేవతా। త్రిష్టుప్ ఛందః। భువనేశ్వరీ శాంత్యంగ పూర్ణాహుత్యాం వినియోగః॥ ఏకం - ద్వే త్రీణి-చత్వారి - పంచ - షట్ - సప్త - అష్టౌ - నవ - దశ ఏకాదశ - ద్వాదశ ఇత్యాజ్యం గృహీత్వా॥ తిష్ఠన్॥ ఓం సముద్రా దూర్మిః ... న ఆయన్॥ ఓం సప్తతే అగ్నే ... ఘృతేన స్వాహా॥ అగ్నయే సప్తహోత్ర ఇదం నమమ॥ పూర్ణాహుతిముత్తమాం ... వా వరుంధే॥ ఓం అగ్నావిష్ణూ...ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

సూ॥ ఉత్తర పరిషేచనం కృత్వా॥

మంత్రం :- అదితేన్వ మగ్ స్థాః ... ప్రాసావీః॥

ప్రణీతాప్స ఆనీయ - ఇత్యాది బ్రహ్మ విసర్జనాంతే వధూ-వరా - వధూ మాత్రంవా వక్ష్యమాణ మంత్రైః కూర్చాగ్రేణాభి మార్జనం కుర్యాత్॥

తతః దిక్పాలకేభ్యో - నవగ్రహేభ్యః తత్తన్నామ మంత్రైర్భువనేశ్వరీ మింద్రాణీ మింద్రేభ్యశ్చ సదీప మాషభక్త బలిం దద్యాత్॥ 3. ఇంద్రాద్యష్ట దిక్పాలకేభ్య స్సర్వేభ్యో ఇమం ... మి। భువనేశ్వర్యై ... ఇమం మి। ఇంద్రాణ్యై ఇమం ... మి। ఇంద్రాయ ... ఇమం మి।

మార్జనా మంత్రాః :-

౧. ఆపోహిష్ఠేతి నవభిః ॥ ఆపోహి ... నిధత్త ౨. స్వస్తిదా విశస్పతి ర్వృత్రహా...స్వస్తిదా అభయం కరః ॥ 3. హిరణ్య శృంగం వరుణమ్ ప్రపద్యే సువాన ఇందుః ౪. గాయత్ర్యా ఓం భూర్భువస్సువః ... చోదయాత్ । ౫. త్ర్యంబకంయజా మహే...మృతాత్ ॥ ౬. జాతవేదసే సునవామ...త్యగ్నిః॥ ౭. దేవస్యత్వా సవితుః ప్రసవేశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాగ్ం సరస్వత్యై ... సామ్రాజ్యే నాభిషించామి ॥ ౮. శివ సంకల్పాః - తమీశానం ... వయం ౯. సహనా వవతు - ఇత్యభిషిచ్య అగ్నిం పున రభ్యర్చ్య - అగ్ని ప్రదక్షి ణాదికం కృత్వా - ఆచార్యాయ ధేను ధానాది యథాశక్తి దక్షిణాం దద్యాత్ ॥ జాపకానాం అనడ్వాహం స దక్షిణాతాం బూలమన్యేభ్యః॥ పునఃపూజా మంటపోద్వాసనాదికం కృత్వా- ఆచార్య హస్తే దత్వా! గచ్ఛ గచ్ఛేత్యగ్ని ముద్వాస్య బృహ త్సామేతి తిలకం ధారయేత్ బృహత్సామ ... రక్ష ॥ మహ దాశీర్వచనం ప్రాప్య ॥ శతమానం భవతి ... ప్రతి తిష్ఠతి ॥ విప్రాన్ సంభోజ్య స్వయం భుంజీత ॥ సర్వేషాం ఋత్విజామిత

రేషాం బ్రాహ్మణానాంచ స ఫల దక్షిణా తాంబూలాదికం సమర్ప్య ॥ ఇతి కమలాకర భట్టుకృతే శాంతి రత్నే । రజో దర్శన శాంతిః ॥

— శుభం భూయాత్ —

## ద్వాత్రింశ దోషధయః

ఉదుంబరః = మేడి సమిధలు మండలు, కుశః = బర్హిస్సు దూర్వా = గరిక, రాజీసం = తామరాకు, పువ్వు, పంచ బిల్వకాః = (తులసి, మారేడు. నిర్గుండి, వాయిల, నిమ్మ. ఉసిరిగ) విష్ణుక్రాంత, పూల పుటిక, తులసి = తులసి దళములు బర్హిషం—శంఖపుష్పకాః శంకువులు శతావరీ = పిల్లపీసర, అశ్వగంధ-(పెన్నేరు గడ్డ) నిర్గుండి వావిలి, సగ్ధ పద్వయం తెల్ల (ఎఱ్ఱ) ఆవాలు, అపామార్గః - ఉత్తరేణి పాలాశః - మోదుగ, పనసః - పనస, జీరకః - జీలకఱ్ఱ, ప్రియంగవః సోములు, గోధూమాః - గోధుమలు, వ్రీహాయః - ఒడ్లు, అశ్వత్థః - రావి, క్షీరం - పాలు, దధి - పెరుగు. సర్పిః - నెయ్యి, పద్మపత్రం- కమలములు, గులాబి, ఉత్పలం - కలువ పూలు, కురంటక త్రయం - గోరంట, ములు గోరంట, గుంజాం=గురిగింజ, భద్రకం - గుమ్మడి,నాగ మల్లె గడ్డ. ముస్తకం - తుంగ ముస్తలు.

## అష్ట మృత్తికా.

గజశాలాత్ - ఏనుగు కట్టుమట్టు నుండి, అశ్వ శాలాత్ - గుఱ్ఱపుశాల నుండి, రథ స్థానాత్ - రథశాల నుండి, వల్మీకాత్ - పుట్టనుండి, సంగమాత్ - నదులు సముద్ర సంగమమును పొందిన చోటు, హ్రాద స్థానాత్ - సరోవరము నుండి, గో కులాత్ - ఆవుల కొట్టము నుండి, రాజద్వార దేశాత్ - రాజ ద్వారము నుండి.

## హోమ ద్రవ్యాణి

దూర్వాభిః - గరికె కాడలతోను, తిలైః - నువ్వులతోను, గోధూమైః - గోధుమల తోను, పాయసేన - పరమాన్నము తోను, ఆజ్యేన - నేతి తోను.

1. పసుపు - కుంకుమ, తమలపాకులు, మొదలగుపూజాద్రవ్యములు 2. కలశములు - 5 మంటపారాధన వస్త్రములు 3. చాపులు చరుపాత్ర (సేరు ఉడికేది) మూతపళ్ళెం - గరిటె. 4. పూర్ణాహుతి ద్రవ్యములు. కొబ్బరి కాయలు సాంబ్రాణి కడ్డీలు కర్పూరము. మొ॥

శ్లో॥ హృది వికసిత పద్మం । సార్క సోమాగ్ని బింబం
ప్రణవమయ మచింత్యం । యస్య పీఠం ప్రకల్ప్య
అచల పరమసూక్ష్మం । జ్యోతిరాకాశ సారం ।
భవతు మమ ముదేఽసౌ । సచ్చిదానంద రూపః ॥

శ్లో॥ రోగాన శేషా నపహంసి తుష్టా
రుష్టాతు కామాన్సకలా నభీష్టాన్
త్వా మాశ్రితానాం న విపన్న రాణాం
త్వాం మాశ్రితాహ్య శ్రయతాం ప్రయాతి ॥

శ్లో॥ సర్వ మంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధకే
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే ॥



తుంగముస్తలు
ఋత్విక్కులు - 8 మంది
ఫలములు - రెండు మూడు
రకములు 21 చొప్పున
ధోవతుల చాపులు - 2
తుండు గుడ్డలు - 5
రవిక గుడ్డలు - 4
చిల్లర డబ్బులు 25-00
తమలపాకులు వక్కలు

దీపారాధన సామగ్రి బ్రాహ్మణ భోజన వసతి ॥

శ్లో॥ అంతరాయ తిమిరోప శాంతయే
శాంత పావనమచింత్య వైభవం
తం నరం వపుషి - కుంజరం ముఖే
మన్మహే కమపి - తుందిలం మహః

వినాయక శాంతి సమాప్తా

శ్రీరామ

శ్లో॥ కళ్యాణ జనకం పుణ్యం సర్వ కల్మష నాశనమ్।
ఆయుర్వృద్ధికరం పుంసాం కుర్యాదాజ్యావలోకనమ్॥

శ్లో॥ యాలక్ష్మీర్వ్యచ్ఛమే దోష్ఠ్యం సర్వాంగేషు వ్యవస్థితమ్।
తత్సర్వం నమయాజ్యత్వం శ్రియం పుష్టించ వర్ధయ॥

శ్లో॥ గచ్ఛ గచ్ఛ సురశ్రేష్ఠ స్వస్థానం పరమం తవ।
బ్రహ్మాణో దేవ గచ్ఛత్వం తత్ర గచ్ఛ హుతాశన॥

## రజస్వలాయా ఉపవేశన విధిః

శ్లో॥ అపూపం లవణం ముద్గం గుడమిశ్రం తథా హవిః దర్వ్యా ద్రాబ్రహ్మణ పత్నీభ్యః । తాభ్యో దద్యాచ్చ భోజనం ॥ ప్రథమర్త్తౌతు పుష్పిణ్యాః పతిపుత్ర యుతాస్త్రియః। అక్షతై రాసనం కుర్య సస్మిన్ స్తాముపవేశయేత్ । హరిద్రా గంధపుష్పాదీన్ దద్యాత్తాంబూలకచిస్రజం । ఆశిషో వాచయేయుస్తాం పతిపుత్రవతీ భవ । దీపైర్నీరాజనం కుర్యాత్ స దీపే వాసయేద్గృహే । తాస్సర్వాః పూజయేత్పశ్చాత్ । గంధ పుష్పాక్షతాదిభిః । భక్షణా పూప ముద్గాది ॥ దద్యాత్తాభ్యస్స్వ శక్తితః ॥

## హోమ విధిః

శ్లో॥ తిసృభిశ్చైవ దూర్వాభిః । ఏకైకా మాహుతిం చరేత్ । అభిమంత్ర్య జుహుయాత్-క్రమాత్ - అష్టోత్తరంసహస్రంతు శతమష్టోత్తరంతువా తిలమిశ్రైశ్చ గోధూమైః ద్రవ్యేణాజ్యాహుతీర్హునేత్ । జుహుయాత్పాయసే నైవం ఆజ్యేనచ హునేత్క్రమాత్ । హవిశ్చతుష్టయేనైవ । ప్రత్యేకం సమసంఖ్యయా । గాయత్ర్యేణతుహోతవ్యం హావిరత్ర చతుష్టయం । తతస్స్విష్టకృతం హుత్వా । రజ్జుప్రహ రణం తథా । అయాశ్చేత్యాదిభిర్హుత్వా సముద్రా దూర్మిసూక్తతః । సంతతా మాజ్యధారాంతాం పూర్ణాహుతి మథాచరేత్ ॥

